# శాన్తి సముచ్చయము



సంకలనము

పార్వెళ్ళ శ్రీధర్ శర్మ






श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम् ,
दक्षिणाम्नाय श्री शारदापीठम् , शृङ्गेरी
**Sri Sri Jagadguru Shankaracharya Mahasamstanam**
Dakshinamnaya Sri Sharada Peetham, Sringeri - 577 139.




Ref : Camp : SRINGERI Date 28-1-2014

శ్రీపార్వెళ్ళ శ్రీధరశర్మగారికి నమస్కారములు .

మీరు మీతండ్రిగారి సప్తత్యబ్దపూర్తి సందర్భమున శాంతిసముచ్చయము అను గ్రంథమును వెలువరింపనున్నారని తెలిసి చాలా సంతోషమయినది . ఈ గ్రంథమునందు ప్రతియొక్కరూ 50 వ సంవత్సరమునుండి 100 వ సంవత్సరమువరకు ప్రతి అయిదుసంవత్సరములకు చేయవలసిన శాంతివిధానము తెలుపబడియున్నది . శ్రేయస్కాములయినవారు ఈవిధానమునను సరించి శాంతినాచరించుట సముచితము . తెలుగులిపిలో ఇట్టి గ్రంథము మొదటిసారిగా మీరు ప్రచురించి ఉత్తమకార్యమునొనర్చినారు . ఈగ్రంథము ఆంధ్రులకు అత్యంతోపయుక్తమగుగాక. మీకు ఇతోధికశ్రేయః ప్రాప్తియగుగాక యని శ్రీజగద్గురుమహాస్వామివారు ఆశీర్వదించినారు.

ఇట్లు


Phone : 08265-250123 / 250192 Fax : 08265-250792
E-mail : info@sringerisharadapeetham.org Vist us : www.sringerisharadapeetham.org

# శాంతి సముచ్చయము

సంకలనము

## పార్వెళ్ల శ్రీధర శర్మ

మాపితృచరణులు శ్రీ పార్వెళ్ళ ఆనందరామశర్మ గారి
వర్షసప్తత్యుత్సవ సందర్భమున ఈ పుస్తకము
ముద్రించబడినది.

ప్రచురణ

21 ఫిబ్రవరి 2014

విజయ మాఘ బ॥ సప్తమి

# SHANTI SAMUCHCHAYAM

by

**Paruvella Sreedhara Sharma**

First Edition : February - 2014

Copies : 500

For Copies

**Paruvella Sreedhara Sharma**

H.No. 10-1-396,

SANTHOSHNAGAR, KARIMNAGAR - 505001.

Ph : 9440029954, 9490255171.

Printed at:

Sharada Printers & Binders

Shastri Road, Karimnagar.

Ph : 0878-2243668, 9849277168.

# విషయసూచిక

శ్రీమాత్రే నమః
శ్రీలక్ష్మీనృసింహస్వామినే నమః

మాడుగుల మాణిక్యసోమయాజి
విద్వదాహితాగ్ని, ఆచార్య చూడామణి,
వేదపయోనిధి, వేదవిద్యా విభూషణ.

శ్రీరస్తు చిరంజీవ పార్వెళ్ళ శ్రీధరశర్మను ఆశీర్వదిస్తూ పరమేశ్వరుని యొక్క ప్రేరణవల్ల నీవు సంకలనము చేసిన శాన్తిసముచ్చయము చాలా సముచితముగా నున్నది, సప్రమాణముగానున్నది. ఇలాంటి గ్రంథములెన్నింటినో సిద్ధమొనర్చి విశేషమైన లోక కళ్యాణమునకు ఉపయోగపడవలెనని ఆశిస్తూ బాల్యదశలో నీవు చేసిన వేదశాస్త్రాధ్యయనములకు సార్థకత చేకూరినదని భావిస్తూ పంద్యులైన పితృచరణుల వర్షసప్తతి మహోత్సవ కార్యక్రమమును దిగ్విజయముగా నిర్వహించి శతవత్సర మహోత్సవమును కూడా జరుపవలెనని ఆశిస్తూ నీ శ్రేయోభిలాషి.

మాడుగుల మాణిక్యసోమయాజి
పట్లూరు.

శ్రీమహాలక్ష్మ్యై నమః

ఆశీస్సుమాక్షతాః

శ్రీభాష్యం విజయసారథిః

కులపతిః

సర్వవైదిక సంస్థానమ్, యజ్ఞవరాహ క్షేత్రమ్,

1 ధీమన్! శాన్తిసముచ్చయం బహువిధై శ్శాన్తి ప్రకారైర్యుతం
కర్తవ్యైః పురుషేణ జన్మ ఫలితాలిప్సావతా చ త్వయా
సంద్రుబ్ధం సులభం విలోక్య సుతరా మానందరామస్య తే
మోదే సప్తతి వత్సరే నిజ పితు శ్శాన్త్యుత్సవే శ్రీధర ॥

2 చండీపాఠ పరంపరా ప్రసిత వాగానంద రామాభిధ
స్తాతస్తే కరణ త్రయీశుచితమ స్తంత్రజ్ఞ విద్వన్నుతః
ఆధివ్యాధి వివర్జిత స్మితముఖః కర్తవ్య నిష్ఠాపరో
దారాపత్య సమృద్ధి యోగ మహితః పూర్ణాయుషాఽఽనందతు ॥

3 మాతాపిత్రనుసేవనా వ్రతపర శ్శీలాఽర్ణవాలంకృతః
పార్వేశ్యాన్వయ వాంశభారికమణి స్సౌజన్యధన్య స్సుధీః
శ్రౌతస్మార్త పవిత్రకర్మ నిరతః ప్రాజ్ఞైర్నుత శ్శ్రీధరః
పుత్రేణాఽఽత్మజయా చ దారసహితో జీయాచ్ఛతం వత్సరాన్ ॥

4 పత్నీ త్వా మనువర్తతే త్రికరణస్వచ్ఛా సతీ శ్రీలతా
ప్రాజ్ఞా త్వత్ ప్రతిబింబితా చ తనయాఽభిజ్ఞా సుతశ్శ్రీరఘుః
ఏతే తే స్వనియోజితార్థ విషయే శ్రద్ధాలు రాతిష్ఠతే
సర్వం పుణ్యఫలాస్పదం భవతి తే శ్రీమన్! సుధీశ్శ్రీధర ॥

5 బార్హస్పతం ముకుళితాది దశావిశిష్టం
భాస్వద్యుగ్రై రవసితం తవ షష్టి సత్రం
సౌరేష్టి రప్యవసితామిహిరస్య భూమ్నా
విందామృతోత్సవముదం భజతాత్ పితా తే ॥

6 అదర్శమాహు రఖిలార్థవిదో భవన్తం
పుత్రం పతిం సహభువం పితరం చ బంధుమ్
జామాతరం గురుమథ శ్వశురం సఖాయ
మానందరామ! తవ జన్మ సదాఽభినంద్యమ్ ॥

7 వస్తుత్రయీ త్రివిధవాద వివేచనాఢ్యః
పూత క్రతుర్ద్విదదభావ రహస్య వేదీ
దుస్సత్త్వవృత్తి దమనః కుహచిత్ కదాచిత్
శ్లాఘ్యః పుమాన్ పరహితార్థముదేతి కోఽపి ॥

8 సహస్ర శశి దర్శనామృత మహోత్సవానందభుం
నిరామయ చిరాయుషా తవ పితా మహోపాసకః
ప్రసన్నముఖ మండలో మధురవాగుదారః ప్రధీ
రుపైతు సకుటుంబకం విబుధ! చండికానుగ్రహాత్ ॥

9 శక్త్యా సర్వజగజ్జని స్థితి లయ వ్యాపార పారీణయా
దిక్కాలాది పరిచ్ఛిదా రహితయా దేవ్యా మహా మాయయా
ఇచ్ఛా జ్ఞాన కృతి స్ఫురత్త్రితిభయా చైతన్య మూర్త్యామయా
సంపృక్త స్సకుటుంబకం పరశివస్త్వాఽఽనంద రామావతు ॥

శ్రీభాష్యం విజయసారథిః
కరీణ్ణగరమ్

# శాన్తిసముచ్చయః

## ఉన్మని

'జన్తూనాం నరజన్మదుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా" అని ఆది శంకరభగవత్పాదులన్నారు. జనన మరణములు చక్రభ్రమణములవలె సంక్రమించుచు తప్పని సరియైనవే. అయిననూ ఆ జనన ముత్తమమైనదైనచో విశేషమే కదా! ప్రాణులలో నరజన్మ, అందులోనూ పురుషుడు, అందులోనూ విప్రత మరింత శ్రేష్ఠమని శంకరుల వాక్కు. ఎందుకు శ్రేష్ఠము అనగా "ఆహార నిద్రా భయమైథునాని సామాన్యమేతత్ పశుభిర్నరాణామ్" ఆహార నిద్రాభయాదులు ఇతర సర్వ వ్యవహారములు ఇతర ప్రాణులకు మనుష్యులకు సమానమే! అయితే మనుష్యునికి వివేకమనునది విశిష్టతగా యున్నది. ఆ వివేకముతో విమర్శించుకొని యుక్తాయుక్తములాలోచించు శక్తి సదసన్నిర్ణయ సామర్థ్యము మానవునికి మాత్రమే కలదు. ఆ మానవులలోనూ విప్రుడైన వానికిది తప్పనిసరి. "వేదో నిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం" బ్రాహ్మణ జన్మమెత్తిన ప్రతి వ్యక్తి ధర్మమేమిటి? కర్తవ్యమేమిటి? వేదాధ్యయనము తప్పక చేయాలి. వేదోక్త ధర్మకర్మలనాచరించాలి. అధర్మమునకు వ్యతిరేకముగా నడుచుకోవాలి. అనగా మనుష్యులలో విప్రునిగా జన్మించిన వానికి తప్పని సరిగా ఆచరించవలసిన కర్మలెన్నియో ఉన్నవి. తాను సత్కర్మలనాచరిస్తూ ఇతరులకు మార్గదర్శకుడిగా మెదలాలి. వేదోక్త ధర్మకర్మలనాచరించుచు ఇతరులతో ఆచరింపజేయాలి. బ్రహ్మచర్యాశ్రమమున వేదాధ్యయన గాయత్రీ గురూపాసన, గార్హస్థ్యమున అధీత వేదోక్త ధర్మకర్మలనాచరించి, వానప్రస్థాశ్రమమున కాలానుసారముగా వనమునకు ప్రస్థానమసాధ్యము కనుక గృహములోనే ఋషివలె జీవించవలయును. అంతేగాక యౌవనముడిగి వార్థక్యములో అడుగిడుతున్నందున పత్నీపుత్రాదులపై ఆధారపడక స్వీయ కర్మలను స్వయముగా ఆచరించుకొను సామర్థ్యమవసరము గనుక

యోగముతో ఉపాసనలతో అట్టి శక్తిని సాధించవలెను. "అనాయాసేన మరణం వినా దైన్యేన జీవనమ్" పొందుటకై శాస్త్రోక్తములైన వయస్సంబంధములైన శాన్తికర్మలనాచరించవలెను. లోకములో షష్టిపూర్తి యొక్కటే ప్రసిద్ధమైయున్నది, కానీ అందులో కూడా చేయవలసిన కార్యములనుగాక శాస్త్రేతరములైన అముఖ్యములైన వేడుకలను మాత్రమే వేడుకగా ఆచరించుచున్నారు. మనుష్యుని అరవయ్యొవ ఏట చేయు శాన్తి గనుక షష్టిపూర్తి యని ప్రసిద్ధమైననూ శాస్త్రములో ఉగ్రరథశాన్తిగా ఇది పేర్కొనబడినది. గ్రహించవలసిన విషయమేమిటంటే కేవలం అరవయ్యొ ఏట చేయవలసిన ఉగ్రరథశాన్తి మాత్రమే కాక యాభయ్యవ ఏటనుండి నూరేళ్ళు నిండినంతవరకు ప్రతి ఐదేళ్ళకూ ఒక్కో విశేష శాన్తి కలదు.

వైష్ణవీ వారుణీచైవ తతశ్చోగ్రరథీతథా
మహారథీ భీమరథీ ఐంద్రీచైవ విశేషతః
చాంద్రీదార్యనికీ రౌద్రీ సౌరీమృత్యుంజయీా తథా
మహామృత్యుంజయీా శాన్తిః క్రమశశ్చప్రకీర్తితాః
అరిష్టపరిహారార్థం శాన్తింకుర్యాత్ప్రయత్నతః ॥ (భట్టభాస్కరీయ మతే)

అని శాస్త్రములో చెప్పబడియున్నది. మానవుడు 50 ఏళ్ళు నిండగానే వైష్ణవీ శాన్తి, 55వ ఏట వారుణీ శాన్తి, 60వ సంవత్సరమున ఉగ్రరథశాన్తి, 65వ వయస్సులో మహారథము, 70వ సంవత్సరము నిండగానే భీమరథశాన్తి, 75వ ఏట ఐంద్రీశాన్తి, 80వ ఏట చాంద్రీ, 85వ ఏట రౌద్రీ, 90వ ఏట సౌరీశాన్తి, 95వ ఏట మృత్యుంజయశాన్తి, 100 సంవత్సరములు నిండగానే మహామృత్యుంజయ శాన్తి చేసుకొనవలెను. అరిష్టపరిహారము కొరకు ప్రతి వ్యక్తి అయావయస్సులో ఆయాశాన్తిని తప్పక ప్రయత్నముతో చేసికొనవలయును. ఈ శాన్తుల వలన శరీరములో కలుగు వార్థక్య మార్పులు కలిగిననూ తేజస్సు ఓజస్సు ధాతుపటిష్ఠత క్షీణించక జీవించినంతకాలము ఆరోగ్యముతో జీవించుటతోపాటు ఐహికమైన సత్ఫలములేగాక ఆముష్మికములైన సత్ఫలములు కూడా కలుగును. ఇందులో

మరియొక విశేషము కూడా కలదు. ఈ శాన్తి కర్మలవలన జ్ఞాతాజ్ఞాతాది సకల దోషములు కూడా నివారించబడును. ఏ మనిషైనా తెలిసో తెలియకో ఏవో పాపములు చేసియుండవచ్చు. ఆ పాప ఫలితములు తాను అనుభవించవచ్చు లేదా అతని సంతానముపై కూడా ఆ ప్రభావము పడవచ్చు. కనుక అట్టి పాపములు ఆ పాప ప్రభావములు కూడా ఈ శాంతుల వలన తొలగిపోవును. ఆ తరువాత మరో విషయమేమిటంటే ఈ శాంతులన్నీ వయస్సును అనుసరించి ఉన్నవి కనుక ఆ వయస్సు దాటిన పిదప తత్పూర్వ వయస్సులో చేయవలసిన శాన్తి చేయలేకపోయినను తరువాత వయస్సులో చేయవలసిన శాన్తితో పాటు తత్పూర్వ శాన్తిని చేయవచ్చు లేదా ఆ శాన్తులయందలి ప్రధాన దేవతలను అయిననూ ప్రస్తుత శాంతియందు పూజించవచ్చు. ఇందుకుదాహరణ ఏమిటంటే జాతకర్మ నామకరణ, అన్నప్రాశన చౌల సంస్కారములను ఉపనయన సంస్కారముతో కలిపి చేయుట గమనించుచున్నాము కదా! దీనికి ఆధారము కూడా కలదు.

"వయోనుసృత్య శాన్తిశ్చ కుర్యాద్యత్నేన బుద్ధిమాన్,
అకృతేపి తతః కుర్యాత్ ఉత్తరేణతు పూర్వికా॥
యథాశస్త్రప్రహారాణాం కవచం వినివారకమ్
తథాదైవోపఘాతానాం శాంతిర్భవతి వారణమ్
ముఖ్యకాలేయదావశ్యం కర్మకర్తుంనశక్యతే
గౌణకాలేపి కర్తవ్యం గౌణేప్యత్రేదృశోభవేత్.

అందువలన ఈ ఏకాదశ శాంతులందలి ప్రధాన దేవతలైన విష్ణు, వరుణ, మార్కండేయ, మృత్యుంజయ, భీమరథ రుద్ర మృత్యుంజయ ఇంద్రకౌశిక చంద్ర మృత్యుంజయరుద్ర సూర్య మహామృత్యుంజయాది దేవతలను తదుత్తర శాంతులందు పూజించుటయుక్తము. శాంతి పూర్తిగా చేసినచో ఇంకనూ మంచిది.

ఆయురభివృద్ధ్యర్థము ఆయుస్సూక్త హవనము, దుగ్ధపానము,

ఆజ్యావేక్షణము దశదానములు, ఆజ్య తిల దానములు సర్వ శాంతి సాధారణములు. కనుక తప్పనిసరిగా అన్ని శాన్తులయందు ఆచరించవలెను. షోడశ దాన తులా పురుష దానములు మున్నగునవి ఐచ్ఛికములు.

శాన్తివిధానమ్ :

శాంతులన్నింటి యొక్క విధాన స్వరూపము సుమారు ఒకే విధముగా ఉండును. ప్రతిశాంతి యందు కూడా గణపతి పూజ, పుణ్యాహవాచనము, దేవతాహ్వానము, పంచగవ్యప్రాశనము, అంకురారోపణము, ఋత్విగ్వరణము, యోగినీమాతృకా వాస్తు క్షేత్రపాలక గ్రహ సర్వతోభద్ర మండల సహిత ప్రధాన దేవతా పూజ నక్షత్రదేవతాపూజ తత్తత్ దేవతా మంత్రహవనము, బలి పూర్ణాహుతి, కలశోద్వాసన, శతచ్ఛిద్ర స్నపనము, క్షీరపానము, ఆజ్యావేక్షణము మహదాశీర్వాదము, ఋత్విక్ సన్మానము. ఈ అంశములు తప్పక ఆచరించవలసినవి. అరుణ సూక్త చండీ రుద్రైకాదశినీ ఇత్యాది కార్యక్రమములు ఐచ్ఛికములు. ఆయుష్య మంత్ర హవనము, నక్షత్రమంత్రహవనము కూడా తప్పని సరిగా చేయవలెను. ఈ అన్ని శాంతులందు కర్తృ నక్షత్ర దేవతా పూజా హవనములు అధిప్రత్యధి దేవతా సహితముగా తప్పని సరిగా చేయవలయును.

యోగినీ మాతృకావాస్తు క్షేత్రపాల గ్రహాదిభిః
సర్వతో భద్ర యుక్తాసావయశ్శాన్తిః ఫలప్రదా ॥

అని యున్నందువలన యోగినీ మాతృకా వాస్తు క్షేత్రపాల గ్రహములను సర్వతో భద్రమండల దేవతలను శాంతియందు తప్పనిసరిగా పూజించవలయును.

గ్రహాణాం ప్రథమం హోమః తతః ప్రాధానికోభవేత్
బ్రహ్మాదీనాంచ దేవానాం అంతే హోమః ప్రకీర్తితః ॥

అని యున్నందున శాంతులన్నింటిలోనూ ముందుగా గణపతి మన్త్ర హవనము కాగానే గ్రహహోమమునాచరించి పిమ్మట ప్రధాన దేవతా హోమము సల్పి తదనంతరము బ్రహ్మాది సర్వదేవతా మంత్రములచే హోమము చేయుట యుక్తము.

తిథివారర్క్ష కరణ యోగవత్సర దేవతాః

స్వీయా మారభ్య నామ్నావా శాంతింకుర్యాద్యథావిధిః॥

తిథి వార నక్షత్ర కరణయోగ సంవత్సర దేవతలను జన్మ తిథివార నక్షత్రాదిగా వేద మంత్రములతో సాధ్యముగానిచో నామ మంత్రములతో నైనను విధిగా పూజించవలెను.

చంద్రగ్రహ ప్రీతికరములు పాలు, చంద్రుని జన్మస్థలము చంద్రస్వరూపము కూడా క్షీరమే. మృత్యుంజయు శని ప్రీతికారకములు మరియు అపమృత్యుహరములు ఆయుర్వృద్ధికరములు తిలగుడములు. కనుక ప్రతి శాన్తియందు తిలగుడ మిశ్రిత దుగ్ధపానము మిక్కిలి శ్రేష్ఠము సత్ఫలదాయకము.

మహాదానేషుయజ్ఞాదౌ ప్రాయశ్చిత్తేషు కర్మసు

తులాదాన వ్రతాదౌచ మహాసంకల్పమాచరేత్

కృత్వా యత్కురుతే కర్మ తదానంత్యాయ కల్పతే ॥

అని చెప్పబడియున్నందున ఆరంభమున సాధారణ సంకల్పముగాక మహా సంకల్పయుక్తముగా శాంతి నారంభించవలెను. అట్లే కలశోదక స్నానమైన పిదప నూతన వస్త్రధారణచేసి మార్కండేయాది చిరంజీవులను ప్రార్థించవలెను. బ్రాహ్మణాశీర్వచనమునకు పూర్వమే సోదరీ కుమార్తెలచేత వయస్సంఖ్యతో సమాన సంఖ్యగల జ్యోతులతో నీరాజన మిప్పించవలెను. పిమ్మట ఆశీర్వాదము సంమానము, బ్రాహ్మణ భోజన మాచరింపజేయవలెను.

అశీతి వర్ష పూర్తికి సహస్ర చంద్ర దర్శనమను పేరుగలదు. వేయి చంద్ర దర్శనములగుట లేదను మాట కలదు. కానీ ఉత్తరాదివారి శాస్త్ర గ్రంథముననుసరించి చూచినచో – 79వ సంవత్సరము నిండి 80వ సంవత్సరారంభములో శాంతి చేసినప్పటికిని 12x79=947. కనుక ఈ 79 సంవత్సరములలో 947 చంద్రదర్శనములు అవుతాయి. ఈ 79 వర్షములలో సుమారు 28 అధిక మాసములు చేరును. అప్పుడు 976 అవుతాయి. 79

సంవత్సరములలో గ్రహణములు 24 కంటే ఎక్కువగనే సంభవించును. గ్రహణము పిమ్మట చంద్రదర్శనము కూడా అమావాస్యా నంతర చంద్ర దర్శనముతో సమానమే కనుక 976+24=1000 సంఖ్య అగును. కనుక సహస్ర చంద్రదర్శనములు అగుచున్నవి.

ఇక మన ప్రాంతమున ఆచారము 83 సంవత్సరముల నాలుగు మాసముల తరువాత ఈ శాన్తి చేయుట కలదు. అంతేగాక అన్ని శాన్తులయందు పూర్తి పదము ఉన్నది కనుక ఆ వయస్సు నిండిన పిదప శాన్తి చేసుకొనవలెను. మరియొక విషయమేమనగా మధురము తినవలెనని అనిపించినపుడు పుట్టిన రోజు జరుపుకున్నట్లు ఏదో ఒక కారణముతో భగవత్ పూజ చేయుటయే ఇచ్చట ముఖ్యోద్దేశ్యము. అంతేగానీ వాద ప్రతివాదనలు కావు. కనుక విజ్ఞులు అలోచించి పండితుల సలహాలను అనుసరించి నిర్ణయము తీసుకోగలరు.

ఈ విధముగా వయస్సననుసరించి ఆయా శాంతుల నాచరించి ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధినంది ఇహ పరసుఖములను పొందగలరని ఆశించుచున్నాను.

ఈ వయస్సంబంధములైన శాంతులను గూర్చి గ్రంథములెన్నియో ఉన్నప్పటికీ దేవనాగరి లిపిలో ఉన్నందున తెలుగు లిపిలో ఉన్నచో పురోహితులందరికి ఉపయోగపడగలదని భావించుచున్నాను.

నాకు సంబంధించిన వారెవరు కనిపించినను వారితో – నా శాస్త్రాభ్యాస సమయములో పూజ్యులు మా శాస్త్ర గురువులు బ్రః॥శ్రీ రాంభట్టర్ గారు మరియు పూజ్యులు స్వామివారల సన్నిధిలో జరిగిన హాస్యాంశములను ప్రస్తావించి సుమారు 30 సంవత్సరముల క్రితము జరిగిన విషయములను జ్ఞప్తికి తెచ్చి నాపై వారికిగల అప్యాయతను చూపుటయే గాక నన్ను చూచిన వెంటనే అవ్యాజ కరుణా వాత్సల్యములను కురిపించి కోరిన వెంటనే వారి అమూల్యాభిప్రాయమునందించిన శ్రీ శృంగేరీ జగద్గురువుల వారికి నా సహస్రాధిక సాష్టాంగ ప్రణామములు. "ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలామివ" అను వాల్మీకి (హనుమ) వాక్కునసత్యము జేసి 35 ఏళ్ళ క్రితం

చెప్పిన వేదము ఆవృత్తి లేకున్నను ఇప్పటికి ధారాళముగా చదువగలుగు విధముగా మాకు వేదవిద్యనందించిన మా గురువర్యులు వేద స్వరూపులు బ్ర॥శ్రీ మాడుగుల మాణిక్యసోమయాజిగారలకు, మరియు సర్వవైదిక సంస్థాన కులపతి, యజ్ఞవరాహ క్షేత్ర నిర్మాతలు, వాత్సల్య పరిపూర్ణులు బ్ర॥శ్రీ శ్రీభాష్యం విజయసారథి గారికి, మరియు సరస్వతీక్షేత్ర నిర్మాత, పుంభావ సరస్వతీ స్వరూపులు బ్ర॥శ్రీ అష్టకాల నృసింహరామశర్మ గారికి హృదయపూర్వక నమస్సుమాంజలులు.

మరొక ముఖ్యాంశమేమన మాపితృదేవులు పార్వెళ్ళ ఆనందరామశర్మ గారు నిరంతర జపధ్యాన పూజాసక్తులు, చండీ సుందరకాండ, రామాయణ పారాయణ పరాయణులు, వారి సప్తతి పూర్తి సందర్భముగా ఈ శాంతి సముచ్చయమును ప్రచురించినచో సందర్భమునను సరించినట్లుండును, అంతే గాక బ్రాహ్మణ బంధుమిత్రులందరికీ ఉపయోగపడునను భావనతో ముద్రణకు ఉపక్రమించితిమి. ఈ గ్రంథసహాయముతో ఏ ఒక్కరైననూ ఈ గ్రంథోక్త శాంతుల నాచరింప జేసికొన్నచో నా జన్మధన్యము. నాకు జన్మనిచ్చి నన్నింత వానిని జేసిన నా పితృదేవులకు ఈ గ్రంథ కుసుమమును అర్పించుచు అంకితము చేయుచున్నాను. "కరణేషు మంత్రీ" అనుటకు ప్రత్యక్ష నిదర్శనమై నన్ను వెన్నంటి ప్రోత్సహించుచు నా అభివృద్ధిని సదా కాంక్షించుచు మా పితృదేవుల సప్తతిపూర్తియందు ఈ పుస్తకము వెలువరించినచో బాగుండునని సలహా ఇచ్చిన నాధర్మపత్ని చి॥ల॥సౌ॥ శ్రీలతకు, వ్రాతలో సహకరించిన నా పుత్రికా పుత్రులు చి॥ అభిజ్ఞా, రఘుచరణులకు శుభాశీస్సులు. నాచే ఈ కార్యమునాచరింపజేసిన ఆ పరమేశ్వరునికి మరియు వాగీశ్వరికి సదా వినమ్రుడను.

పార్వెళ్ళ శ్రీధరశర్మ

కరీంనగరమ్

విజయనామ సం॥ర మాఘ బ॥ సప్తమి

21-02-2014

## శాంతులు – ప్రధాన ఉపదేవతలు

| శాంతి | వయస్సు | ప్రధానదేవతా | ఉపదేవతా |
|---|---|---|---|
| 1. వైష్ణవీశాన్తిః | 50 | విష్ణుః | మృత్యుంజయత్ర్యంబకః |
| 2. వారుణీ శాన్తిః | 55 | వరుణః | త్ర్యంబకః |
| 3. ఉగ్రరథశాన్తిః | 60 | మార్కండేయ | ఆయుర్దేవతా బ్రహ్మావిష్ణు మృత్యుంజయరుద్రాః అశ్వత్థామాది చిరజీవనః |
| 4. మహారథశాన్తిః | 65 | మృత్యుంజయమహారథః | త్ర్యంబకః |
| 5. భీమరథశాన్తిః | 70 | భీమరథమృత్యుంజయ రుద్రః | వరుణః ప్రత్యధి దేవతా అశాపాలః |
| 6. ఐంద్రీశాన్తిః | 75 | ఇంద్రకౌశికః | పరివార దేవతాః సహస్రాక్షాదయః ఉపదేవతా త్ర్యంబకః |
| 7. చాంద్రీశాన్తిః | 80 | చంద్రః | త్ర్యంబకః కాలస్వరూప సూర్యః |
| 8. రౌద్రీ శాన్తిః | 85 | మృత్యుంజయరుద్రః | మృత్యుంజయత్ర్యంబకః |
| 9. సౌరీ శాన్తిః | 90 | కాలస్వరూపసూర్యః | మృత్యుంజయత్ర్యంబకః |
| 10. మృత్యుంజయ శాన్తిః | 95 | మృత్యుంజయ రుద్రః | |
| 11. మహామృత్యుంజయశాన్తిః | 100 | | మహామృత్యుంజయః |

పరివార దేవతాః విశ్వేశ్వరాది ఏకాదశరుద్రాః

ఉపదేవతా సూర్యః

పంచాశద్వర్షే కర్తవ్యా

# వైష్ణవీ శాంతిః (50)

అస్యాం శాంత్యాం ప్రధాన దేవతా విష్ణుః, ఉపదేవతా మృత్యుంజయ త్ర్యంబకః సమిదాజ్య చరుపాయస ఘృతాక్త తిలైః హోమః

కర్తా జన్మనః సకాశాత్ పంచాశద్వర్షే ప్రాప్తే జన్మదినే జన్మ నక్షత్రే చంద్రానుకూల్యే శుభేహని కృతాభ్యంగః కృతనిత్యక్రియః సవస్త్ర పీఠాసనే ఉపవిశ్య నూతన యజ్ఞోపవీతీ పవిత్రపాణిః ఆచమ్య ప్రాణానాయమ్య మహా సంకల్ప పఠనం కృత్వా తదంతే - ఏతేషాం ప్రేరకస్య అంతః కరణైః సగోచరైః సంబంధే సతి సంభావితానాం సకల పాపానాం నివృత్తి ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం యేయే గ్రహాః శుభ స్థానేషు స్థితాః తేషాం గ్రహాణాం అత్యంత శుభ ఫలావా ప్త్యర్థం యేయే గ్రహాః అరిష్ట స్థానేషు స్థితాః తైస్తైః క్రియమాణ కరిష్యమాణ దుర్దోష పీడా నివృత్తిపూర్వక శుభ ఏకాదశ స్థాన ఫలావాప్త్యర్థం భూతభవిష్యత్ వర్తమాన కాలత్రయ సూచిత ఆగామి అరిష్ట నివారణార్థం -- గోత్రస్య -- వంశోద్భవస్య -- నామధేయస్య -- నక్షత్రే -- చరణే -- రాశౌ జాతస్య -- నామ ధర్మపత్నీ సమేతస్య -- నామ పుత్ర సమేతస్య -- నామ పుత్రికా సమేతస్య మమ సకుటుంబస్య ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం విశేషతః మమ జన్మనః సకాశాత్ పంచాశద్వర్షే ప్రాప్తే సూచిత సంభావ్యమాన నానావిధరోగ, దృష్టిమాంద్య ఛాయా వైకృత్య భార్యాపుత్రాది వియోగ ధనధాన్య పశుక్షయాది అరిష్ట నివారణార్థం సంపూర్ణ ఆరోగ్య సిద్ధి ద్వారా ధర్మకర్మ నిర్వహణార్థం ఉత్పన్న ఉత్పత్స్యమాన సమస్త పీడా పరిహార పూర్వకం సర్వవిధ సుఖావాప్తి ధనధాన్యాద్యభివృద్ధ్యర్థం ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం సమస్త మంగళ ప్రాప్త్యర్థం విద్వదుపదిష్టేన విధినా యథాసంభృత సంభారైః యథాశక్తి సగ్రహ మఖాం శౌనకోక్తాం వైష్ణవీ శాంతిం తిథి వార నక్షత్ర యోగ కరణ వర్ష ఋతు అయన

మాస పక్ష యోగినీ మాతృకా వాస్తు క్షేత్ర పాల నవగ్రహ సర్వతోభద్ర అయుర్దేవతా సహితాం కరిష్యే. తదంగ కలశ గణపతి పూజాం స్వస్తిపుణ్యాహ వాచనం నాందీ సువర్ణాభ్యుదయికం పంచగవ్య ప్రాశనం ఋత్విగ్వరణం అంకురారోపణంచ కరిష్యే.

కలశ గణేశ గౌరీ పూజాంకృత్వా పుణ్యాహం వాచయిత్వా శరీర శుద్ధ్యర్థం పంచగవ్య మేళనం ప్రాశనంచ కరిష్యే

# పంచగవ్య విధానమ్ (సర్వశాంతిషు ఉపయోగి)

మధ్యపాత్రస్థ గోమూత్రే 'ఇమంమే వరుణం' ఇతి మంత్రేణ వరుణం

ప్రాగ్దిశిస్థిత గోమయే 'అగ్నేనయే'తి మంత్రేణ అగ్నిం,

దక్షిణదిశి స్థిత క్షీరే 'ఆప్యాయస్వే'తి మంత్రేణ సోమం,

పశ్చిమ దిశి స్థిత దధ్ని 'తవవాయ్వి'తి మంత్రేణ వాయుం,

ఉత్తర దిశి స్థిత ఆజ్యే 'అకృష్ణేనే'తి మంత్రేణ సూర్యం,

ఈశాన్యే స్థిత కుశోదకే బ్రహ్మమంత్రేణ బ్రహ్మాణం ఆవాహ్య సంపూజ్య

కాంస్యపాత్రే మేళనం కారయేత్ గాయత్ర్యా గోమూత్రం, గంధద్వారామితి మంత్రేణ

గోమయం, ఆప్యాయస్వేతి మంత్రేణ గోక్షీరం, దధిక్రావ్ణ ఇతి మంత్రేణ దధి,

శుక్రమసీతి మంత్రేణ ఘృతం, దేవస్యత్వేతి మంత్రేణ కుశోదకంచ

అవదాయ యజ్ఞకాష్ఠేన ప్రణవోచ్చారణ పూర్వకం నిర్మంథ్య

యత్త్వగస్థి గతం పాపం దేహే తిష్ఠతి మామకే

ప్రాశనాత్ పంచగవ్యస్య దహత్యగ్ని రివేంధనమ్ ఇతి ప్రాశ్య ఆచమేత్

అత్ర శ్లోకాః

గోమూత్రం మధ్యదేశేతు గోమయం పూర్వతో న్యసేత్

క్షీరం దక్షిణదేశేతు దధి పశ్చిమ తోన్యసేత్

ఆజ్యముత్తర దేశేతు ఈశాన్యే తుకుశోదకమ్

ఇమం మేవరుణ మంత్రేణ గోమూత్రే వరుణంన్యసేత్

అగ్నేనయేతి మంత్రేణ గోమయేఽగ్నిం తథాన్యసేత్

అప్యాయస్వేతి మంత్రేణ క్షీరే సోమంచ విన్యసేత్

ఆకృష్ణేనేతి మంత్రేణ ఘృతే సూర్యం తథైవచ

బ్రహ్మలింగక మంత్రేణ బ్రహ్మాణంతు కుశోదకే

దేవతాన్యాస పూజాన్తే తత్తన్మంత్రేణ మేళనమ్

గాయత్ర్యాదాయ గోమూత్రం గంధద్వారేతి గోమయమ్

అప్యాయస్వేతి గోక్షీరం దధిక్రాష్ణస్తథాదధి

శుక్రమసీత్యాజ్య మంత్రం దేవస్యేతి కుశోదకమ్ ॥

ప్రణవేన యజ్ఞకాష్ఠేన నిర్మంథ్యచ విశుద్ధయే ॥

తతః నాందీ సువర్ణాభ్యుదయికం ఋత్విగ్వరణం చ కారయేత్

<u>ఋత్విగ్వరణమ్</u>   <u>సర్వశాంతిషు ఉపయోగి</u>

ఓం బృహస్పతే -- చిత్రమ్ ।

హే ఆచార్య యథాస్వర్గే శక్రాదీనాం బృహస్పతిః ..

తథాత్వం మమ యాగేఽస్మిన్ ఆచార్యో భవ సువ్రత. ఇత్యుక్త్వా గంధాదిభిః సంపూజ్య వస్త్ర తాంబూల హిరణ్యం దత్వా అస్మిన్ వైష్ణవీ శాంతి కర్మణే ఆచార్యం త్వామహం వృణే.

ఓం బ్రహ్మ జజ్ఞానం-వివః ॥

యథా చతుర్ముఖో బ్రహ్మా సర్వలోక పితామహః

తథాత్వం మమ యాగేస్మిన్ బ్రహ్మా భవ ద్విజోత్తమ. అస్మిన్ వైష్ణవీ శాంతి కర్మణి బ్రహ్మాణం త్వామహం వృణే.

ఓం నమస్సదసే -- పృథివ్యై ॥

త్వన్నో గురుః పితామాతా త్వం ప్రభుస్త్వం పరాయణమ్

వితతే మమయాగేఽస్మిన్ సదస్యోభవ సువ్రత

అస్మిన్ వైష్ణవీ శాంతి కర్మణి సదస్యం త్వామహం వృణే.

ఓం యోవా ఉపద్రష్టార -- గచ్ఛతే ॥

భగవన్ సర్వధర్మజ్ఞ సర్వ ధర్మ భృతాం వర

వితతే మమ యాగేస్మిన్ ఉపద్రష్టా భవద్విజ. అస్మిన్ వైష్ణవీ శాంతి కర్మణి ఉపద్రష్టారం త్వామహం వృణే.

వైష్ణవీ శాన్తి కర్మార్థం, భవంతో ఽ భ్యర్థితామయా
సుప్రసన్నాః ప్రకుర్వంతు ప్రయోగం విధిపూర్వకమ్ ॥
(వారుణీ శాన్తి కర్మార్థం, శాంత్యాముగ్రరథాఖ్యాయాం,
శాన్త్యాం భీమరథాఖ్యాయాం, మహారథ్యాఖ్య శాన్త్యర్థం,
ఐన్ద్ర్యాభిఖ్య శాన్త్యర్థం, చాంద్ర్యాభిఖ్య శాన్త్యర్థం,
రౌద్ర్యాభిఖ్య శాన్త్యర్థం, సౌర్యాభిఖ్య శాన్త్యర్థం,
మృత్యుంజయాఖ్య శాన్త్యర్థం, మహామృత్యుంజయా శాన్త్యై
ఇతి ఊహః)

తత : అంకురారోపణం కృత్వా పాలికాః చతుర్దిక్షు సంస్థాప్య తిథి వార నక్షత్ర యోగ కరణ ఋతు అయన మాస పక్ష వత్సర యోగినీ మాతృకా వాస్తు క్షేత్రపాల సర్వతోభద్రమండల దేవతాః ఆవాహ్య సంపూజ్య తదుత్తరే వ్రీహీన్ తిలాన్ తండులాంశ్చ ఉపర్యుపరి నిక్షిప్య తదుపరి ప్రధాన దేవతాం విష్ణుం ఇదం విష్ణురితి మంత్రేణ, మృత్యుంజయ త్ర్యంబకం త్ర్యంబక మంత్రేణ, ఆయుర్దేవతా స్వరూపం బ్రహ్మాణం యోబ్రహ్మేతి మంత్రేణ

ఆయుర్దా ఇతిమంత్రేణ వా ఆవాహ్య తథా యజమాన నక్షత్ర

దేవతాం అధిదేవతా ప్రత్యధి దేవతా సహితాంచ

ఆవాహ్య ఆవాహితాన్ సర్వాన్ విధినా సంపూజ్య

వరదనామానం అగ్నిం ప్రతిష్ఠాప్య షట్పాత్ర ప్రయోగం కృత్వా గణేశ గౌరీ మాతృకా యోగినీ వాస్తు క్షేత్రపాల గ్రహ సర్వతోభద్ర తిథి వార నక్షత్ర యోగ కరణ అయన ఋతు మాస పక్ష వత్సర దేవతా మంత్రైః నామ మంత్రైర్వా సమిదాజ్య చరుపాయస ఘృతాక్తతిల ద్రవ్యైః హవనం కృత్వా తతః ప్రధాన దేవతాం విష్ణుం ఇదం విష్ణురితి మంత్రేణ యథాశక్తి సంఖ్యం హుత్వా మృత్యుంజయ ఆయుష్య నక్షత్ర మంత్రైరపి హోమః కారయేత్. స్విష్టకృతాత్ ప్రాక్ పురుషసూక్త శ్రీసూక్త నమక చమక శివసంకల్ప ఆయుస్సూక్త భద్రసూక్తాది మంత్రాన్ వాచయిత్వా జయాది ప్రాయశ్చిత్త హోమాంతే బలిందత్వా పూర్ణాహుతించ కృత్వా సంస్రావాది హోమ శేషం సమాప్య కలశోదకైః నవగ్రహ వారుణ అఘమర్షణ విష్ణుసూక్త నారాయణసూక్తైః యజమానం అభిషిచ్య అభిషేక వస్త్రం ఆచార్యాయదత్వా నూతన వస్త్రద్వయం ధృత్వా మార్కండేయాది సప్తచిరజీవినః ప్రార్థయేత్.

తతః ఆయుర్వృద్ధయే సతిల గుడసమ్మిశ్ర దుగ్ధం ప్రాశయేత్.

ప్రాశన మంత్రః - సతిలం గుడసమ్మిశ్రం అంజల్యర్ధమితం పయః

మార్కండేయాత్ వరం లబ్ధ్వా పిబామ్యాయుర్వివృద్ధయే ॥

తతః కాంస్య పాత్రే ఘృతమాసిచ్య పాత్రస్థిత దేవతాం సంపూజ్య 'రూపం రూపమి'తి మంత్రేణ ఆజ్యావలోకనం కృత్వా సదక్షిణాకం తత్పాత్రం బ్రాహ్మణాయ దత్వా దశ దానాని కారయేత్.

## సర్వశాన్తిషు ఉపయోగి

గోదానం : గవామంగేషు తిష్ఠంతి భువనాని చతుర్దశ

తస్మాదేనామహం దద్యా మతశ్శాంతిం ప్రయచ్ఛమే॥

మయాకృత - శాంతి సాంగతా సిద్ధ్యర్థం - గోత్రాయ మహావిష్ణు

స్వరూపాయ బ్రాహ్మణాయ సదక్షిణాకం గోదానం తుభ్యమహం సంప్రదదే నమమ.

భూదానం : సర్వసస్యాశ్రయా భూమిర్వరాహేణ సముద్ధృతా

తస్మాదస్యాః ప్రదానేన విశ్వాత్మా ప్రియతాం హరిః ॥

తిలదానం : యస్మాన్మధురిపోర్విష్ణోః దేహ స్వేద సముద్భవాః

హవ్య కవ్యేషు శస్తాశ్చ తస్మాచ్ఛన్నో భవంత్విహ ॥

తిలాః కాశ్యప సంభూతాః నిత్యం పాపహరాశ్శుభాః

తిలదానాదసహ్యంమే పాపం నాశయ కేశవ ॥

హిరణ్యదానం : హిరణ్య గర్భ గర్భస్థం హేమ బీజం విభావసోః

అనంత పుణ్య ఫలదమతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

జన్మాంతర సహస్రేషు యత్కృతం దురితం మయా

హిరణ్యస్య ప్రదానేన శాంతిరస్తు సదామమ ॥

అజ్యదానం : కామధేనో స్సముద్భూతం సర్వక్రతుషు సంస్థితమ్
దేవానామాజ్యమాహార మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

వస్త్రదానం : శ్వేత వస్త్రం మహాపుణ్యం చంద్ర ప్రీతికరం సదా
శుభదం సర్వలోకానామతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

ధాన్యదానం : సర్వదేవ మయం ధాన్యం సర్వోత్పత్తి కరం మహత్
ప్రాణినాం జీవనోపాయ మతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

గుడదానం : యతోరసానాం ప్రవరః స్యాద్విష్ణో మధురోరసః
తస్మాత్ గుడం ప్రదాస్యామి తతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

రౌప్యం : శంభుదేహోద్భవం శుభ్రం ధారణేమంగళప్రదమ్
దర్శనాత్సర్వ పాపఘ్నం రౌప్యం దేహ్యనిశం మమ ॥

లవణం : యస్మాదన్నరసాస్సర్వే నోత్కృష్టా లవణం వినా
ఆయుః ప్రీతిపదం నిత్యమతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥
రసానాం అగ్రజం శ్రేష్ఠమ్ లవణం బలవర్ధనమ్
తస్మాదేతత్ ప్రదాస్యామి తతశ్శాంతిం ప్రయచ్ఛమే ॥

ఇతి దశదానాని దత్వా తతః విసర్జిత దేవతాపీఠదానం కృత్వా పుత్రాదికైః పుష్పమాలా నూతన వస్త్రాదిభిః యజమానం సత్కృత్య సోదరీ పుత్రికా సువాసినీభిః పంచాశద్దీపైః నీరాజయిత్వా బ్రాహ్మణాశీర్వచనం గృహీత్వా బ్రాహ్మణ భోజనం ప్రకల్ప్య ఋత్విజః సమ్మాన్య దక్షిణాదికం దత్వా కృత కర్మ పరమేశ్వరార్పణం కృత్వా సర్వదేవాన్నమస్కృత్య ద్విరాచమ్య త్రివారం విష్ణుస్మరణం కుర్యాత్. వారుణ మంత్రైః గ్రహమంత్రైః అఘమర్షణ సూక్తపఠనైః స్నాపయేత్ ఇతి శమ్.

ఇతి వైష్ణవీ శాన్తిః

పంచాధిక పంచాశద్వర్షే కర్తవ్యా

# వారుణీశాన్తిః - (55)

అథకర్తా యజమానః జన్మనః సకాశాత్ పంచాధిక పంచాశద్వర్షే ప్రాప్తే జన్మదినే జన్మర్క్షేవా చంద్రానుకూల్యే శుభేహనివా కృతాభ్యంగః కృత నిత్యక్రమః కృతాగ్నిసిద్ధిః శుభే సవస్త్ర పీఠాసనే ఉపవిశ్య యజ్ఞోపవీతీ అచమ్య పవిత్రపాణిః ప్రాణానాయమ్య పంచగవ్య ప్రాశనేన శరీరం సంశుధ్య సువాసిన్యా కృత మంగళ తిలకః దేవతా గుర్వాదీంశ్చాభివాద్య బ్రాహ్మణైర్దత్తానుజ్ఞః స్వాసనే ఉపవిశ్య పునరాచమ్య ప్రాణానాయమ్య దేశకాలౌసంకీర్త్య శ్రీ పరమేశ్వర పీత్యర్థం అముకగోత్రః అముకశర్మాహం మమజన్మనః సకాశాత్ పంచ పంచాశత్తమేవర్షే ప్రాప్తే సూచిత సంభావ్యమాన నానావిధరోగ దృష్టిమాంద్య ఛాయావైకృత్య భార్యాపుత్రాది వియోగ-ధనధాన్య పశుక్షయాది-అరిష్టనిరసనార్థం జన్మరాశి జన్మలగ్నాభ్యాం సకాశాత్ గోచరేణ అనిష్టస్థాన స్థిత ఆదిత్యాది నవగ్రహాణాం ఉత్పన్నోత్పత్స్యమానానాం పీడాపరిహార పూర్వకం సర్వసుఖావాప్తి ధనధాన్యా ద్యభివృద్ధ్యర్థం సమస్తమంగళప్రాప్త్యర్థం దేశకాలాద్యనుసారతః విద్వదుపదిష్టేన విధినా యథాసంభృత సంభారైః యథాశక్తి యథాజ్ఞానతః సగ్రహమఖాం శౌనకోక్తాం వారుణీశాన్తింకరిష్యే. తదంగ స్వస్తి పుణ్యాహవాచనం మాతృకాపూజనం నాందీశ్రాద్ధం ఆచార్య వరణంచ కరిష్యే. తత్రాదౌ నిర్విఘ్నతా సిద్ధ్యర్థం మహాగణపతి పూజనంచకరిష్యే ఇతి సంకల్ప్య తాని కృత్వా వృతాచార్యః స్థండిలసమీపముపవిశ్య ఆచమ్యేత్యాది శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం అముకగోత్రోత్పన్నేన అముకశర్మణాయజమానేన సంకల్పితవారుణీ శాంతి కర్మణి వృతోఽహం యథాజ్ఞానతః దేశకాలాద్యనుసారేణ ఏభిర్బ్రాహ్మణైః సహ ఆచార్య కర్మ కరిష్యే తదంగ శరీర శుద్ధ్యర్థం పురుషసూక్త పఠనం కృత్వా గణపతింస్మృత్వా ధ్యాత్వా భూశుద్ధయే గౌరసర్షపవికిరణం కృత్వా స్థండిలాత్ పూర్వభాగే వేదీంప్రకల్ప్య సర్వతోభద్రం విరచ్యతదుత్తరే పీఠే సవస్త్రతండులే కలశం ప్రతిష్ఠాప్య వరుణం

సంపూజ్య పూర్ణపాత్రే అష్టదళకర్ణికాయాం కృతాగ్న్యుత్తారణ పూర్వికాయాం సువర్ణప్రతిమాయాం 'ఇమంమే వరుణ' ఇతిమన్త్రేణ ప్రధాన దేవం వరుణ మావాహయేత్. అస్యాం సువర్ణమయ్యాం ప్రతిమాయాం ప్రధానదేవతాం పాశమోచనం వరుణం సాంగం సపరివారం సాయుధం సశక్తికం 'ఇమంమే' వరుణఇతిమంత్రేణ వ్యాహృతిభిరావాహ్య ప్రాణప్రతిష్ఠాం కృత్వా తదుత్తరే త్ర్యం బకం ఆవాహ్య తదుత్తరే నక్షత్ర దేవతాం ఆవాహ్య తదుత్తరే నవగ్రహాదీ నావాహ్య సర్వదేవాన్ సంపూజ్య స్థండిల సమీపమేత్య గ్రహాన్ అన్వాదధ్యాత్. తతః ప్రధాన దేవతామంత్రహోమం సమిత్, ఆజ్య, చరు, పాయస ద్రవ్యైః యథాశక్తి సంఖ్యయా హుత్వా, మృత్యుంజయం ఘృతాక్త తిల ద్రవ్యేణ, నక్షత్ర దేవతాం ఆజ్య ద్రవ్యేణ యక్ష్యే. శేషం పూర్వశాంతివత్. పంచ పంచాశద్దీపైః నీరాజనమ్.

## షష్టి తమ వర్షే కర్తవ్యా

# ఉగ్రరథ శాంతిః (60)

యజమానః షష్టితమ వర్షారంభదినే జన్మ నక్షత్రేవా శుభతిథౌ మంగళాచార పూర్వకం మహా సంకల్ప గణేశ పూజన పుణ్యాహవాచన నాందీ ఋత్విగ్వరణ తిథి వార నక్షత్ర యోగకరణ వర్షదేవతాః యోగినీ మాతృకా వాస్తు క్షేత్రపాల గ్రహ సర్వతోభద్ర దేవతాశ్చ ఆవాహ్య సంపూజ్య, అగ్నిం ప్రతిష్ఠాప్య ఆవాహితదేవతాః యథాశక్తి సంఖ్యయా హవనేన సంతర్ప్య ప్రధానదేవతా మంత్రేణ సమిదాజ్య చరు దూర్వా పాయసైః యథాశక్తి సంఖ్యయా హుత్వా తతః తిలహోమం ఆయుష్యహోమంచ సమాప్య బలిందత్వా పూర్ణాహుతిం కృత్వా కలశోద్వాసనం కృత్వా కలశ జలేన స్నాపయేత్ శేషం పూర్వవత్. షష్టిదీపైః నీరాజనమ్.

## అత్ర విశేష - హవనీయ ద్రవ్యాణి

ప్రధాన దేవతాయై మార్కండేయాయ-సమిదాజ్య చరు దూర్వా పాయసాః

మృత్యుంజయాయ- తిల ఆజ్య దూర్వాః

అశ్వత్థామాదీనాం-లాజద్రవ్యమ్.

అస్యాం శాంత్యాం తులాపురుష దానం అవశ్యం కర్తవ్యమితి కేచిత్ వదన్తి.

మార్కండేయమన్త్రః :- మార్కండేయ మహాభాగ సప్త కల్పాన్త జీవన

ఆయురారోగ్యమైశ్వర్యందేహిమే మునిపుంగవ॥

అత్ర సంకల్పః :- శుభతిథౌ మమ జన్మనః సకాశాత్ షష్టితమ వర్ష ప్రాప్త్యా భవిష్యత్వేన సూచితానాం అపమృత్యు- అనారోగ్య-భార్యా పుత్రాది వియోగ-గ్రహపీడా రాజభయాది వివిధ అరిష్ట నివారణార్థం దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృధ్యర్థం మార్కండేయాది చిరంజీవదేవతా ప్రసాద సిద్ధ్యర్థం ఉగ్రరథశాన్తి కర్మ కరిష్యే.

### పంచషష్టితమే కర్తవ్యా (65)

## మహారథీశాన్తిః

అథ కర్తా యజమానః జన్మనః సకాశాత్ పంచాధిక షష్టితమే వర్షే ప్రాప్తే జన్మదినే జన్మనక్షత్రేవా చంద్రానుకుల్యే శుభేహని మహా సంకల్పేన సంకల్ప్య మమ పంచాధిక షష్టితమే వర్షే ప్రాప్తే సూచిత సంభావ్య మాన నానావిధ రోగ భార్యాపుత్రాది వియోగ ధన ధాన్య పశుక్షయాది వివిధ అరిష్ట నిరసనార్థం జన్మరాశి జన్మ నక్షత్ర వశాత్ జన్మరాశిజన్మ లగ్నాభ్యాం సకాశాత్ గోచరేణ అనిష్ట స్థానస్థిత గ్రహాణాం ఉత్పన్న ఉత్పత్స్యమాన పీడా నివారణ పూర్వకం సర్వ సుఖాప్తి ధన ధాన్యాది అభివృధ్యర్థం సమస్త

మంగళ ప్రాప్త్యర్థం విద్వదుపదిష్టేన విధినా యథాశక్తి సంభృత సంభారైః సగ్రహ మఖాం మహారథ మృత్యుంజయ దేవతా ప్రీత్యర్థం మృత్యుంజయ మహారథీ శాంతిం కరిష్యే.

గణపతి పూజయా ఆరభ్య సర్వదేవతా మండల దేవతాః ఆవాహ్యా మానోమహాన్త మితిమంత్రేణ మృత్యుంజయ మహారథం త్ర్యంబక మంత్రేణ మృత్యుంజయం, యజమాన నక్షత్ర దేవతాంచ ఆవాహ్యా విధివత్ సంపూజ్య అగ్నిం ప్రతిష్ఠాప్య మృత్యుంజయం సమిదాజ్య చారుపాయసాది ద్రవ్యైః హుత్వా, రుద్ర ఆయుష్యమంత్ర హవనంచ కృత్వా శేషం పూర్వ శాన్తివత్ పూరయేత్. మంగళస్నానానన్తరం పంచషష్టి దీపైః నీరాజనమ్, ఇతి శమ్.

## అథ సప్తతితమే వర్షే కర్తవ్యా

# భీమరథ శాంతిః – (70)

యజమానః జన్మనః సకాశాత్ సప్తతితమే వర్షే ప్రాప్తే జన్మదినే జన్మనక్షత్రే చంద్రానుకూల్యే శుభేహని కృతాభ్యంగః యజ్ఞోపవీతీ ఆచమ్య పంచగవ్య ప్రాశనం కృత్వా పునః ఆచమ్య మహాసంకల్పం గణపతి పూజనం పుణ్యాహవాచనం కృత్వా నాందీ ఋత్విగ్వరణం కృత్వా మమ జన్మనః సకాశాత్ సప్తతితమే వర్షే ప్రాప్తే సూచిత సంభావ్యమాన నానావిధరోగ దృష్టిమాంద్య ఛాయావైకృత్య భార్యాపుత్రాది వియోగ ధనధాన్యపశుక్షయాది అరిష్ట నివారణార్థం జన్మరాశి జన్మలగ్నాభ్యాం సకాశాత్ గోచరేణ అనిష్టస్థానస్థిత ఆదిత్యాది నవగ్రహాణాం ఉత్పన్న ఉత్పత్స్యమాన పీడాపరిహార పూర్వకం సర్వసుఖావాప్తి ధనధాన్యాద్యభివృద్ధ్యర్థం సమస్త మంగళప్రాప్త్యర్థం విద్వదుపదిష్టేనవిధినా యథా సంభృత సంభారైః సగ్రహమఖాం శౌనకోక్తాం భైమరథీశాంతిం కరిష్యే.

తదంగత్వేన యోగినీ మాతృకా వాస్తు క్షేత్రపాలక నవగ్రహ సర్వతోభద్రమండల తిథివార పక్ష మాస నక్షత్ర సంవత్సర అయిన ఋతు దేవతా మండలాన్ కలశపూర్వకాన్ సంస్థాప్య తత్తద్దేవతాః ఆవాహ్య సంపూజ్య అగ్నిం ప్రతిష్ఠాప్య ప్రధానకలశే ప్రధాన దేవతాం భీమరథ మృత్యుంజయ రుద్రం "స్తుహిశ్రుతం" ఇతి మంత్రేణ ఆవాహ్య తదుత్తరే వరుణం, దక్షిణే ఆశాపాలదేవతాః ఉపదేవతాం త్ర్యంబకం చ ఆవాహ్య సంపూజ్య తదనంతరం నవగ్రహ సహిత అవాహిత దేవతామంత్ర హవనం కృత్వా ప్రధాన దేవతాయై ఘృతాక్తతిలైః యథాశక్తి హుత్వా నక్షత్ర వరుణ ఆశాపాల దేవతా మంత్రైః అయుష్సూక్తేనచ యథాశక్తిసంఖ్యం హునేత్. స్విష్టకృతాత్ పూర్వం శ్రీసూక్త పురుషసూక్త అయుష్సూక్త రుద్రసూక్తాన్ జపేత్ శేషం పూర్వ శాంతివత్. సప్తతి దీపైః నీరాజనమ్.

## ఆశాపాలమన్త్రః

ఆశానామ్త్వాశాపాలేభ్యః । చతుర్భ్యో అమృతేభ్యః ।
ఇదం భూతస్యాధ్యక్షేభ్యః । విధేమహవిషా వయమ్।
విశ్వా ఆశామధునా సగ్ంసృజామి।
అనమీవా అప ఓషధయోభవన్తు ।
అయం యజమానో మృధో వ్యస్యతామ్ ।
అగృభీతాః పశవః సన్తుసర్వే ॥

## పంచాధిక సప్తతితమే వర్షే కర్తవ్యా

## ఐంద్రీ శాంతిః (75)

మమ జన్మనః సకాశాత్ పంచాధిక సప్తతితమే వర్షే ప్రాప్తే జన్మదినే జన్మనక్షత్రే సూచిత సంభావ్యమాన సర్వారిష్ట నివారణార్థం శౌనకోక్తాం సగ్రహమఖాం ఐంద్రీశాంతిం కరిష్యే. పూర్వవత్ సర్వమండల దేవతా

ఆవాహనానంతరం ప్రధాన దేవతాం ఇంద్రం 'ఇంద్రంవ' ఇతి మంత్రేణ పూర్వాది అష్టదిక్షు సహస్రాక్ష శతక్రతు వజ్రపాణి పురందర అభయంకర శచీపతి స్వర్గాధిప ఇంద్రాన్ దేవతాన్ ఆవాహ్య తదుత్తరే త్రియంబకం నక్షత్ర దేవతాంశ్చ ఆవాహ్య సర్వాన్ దేవాన్ సంపూజ్య అగ్నిం ప్రతిష్ఠాప్య తత్తన్మంత్రైః హుత్వా శేషం పూర్వశాంతి వత్ పూరయేత్. పంచసప్తతి దీపై ర్నీరాజనమ్.

### అశీతితమే వర్షే కర్తవ్యా

## సహస్రచంద్ర దర్శనశాంతిః 80

అస్యాం శాంత్యాం ప్రధాన దేవతా - సహస్ర సంఖ్యా దర్శన గుణవిశిష్ట చంద్రః అధిదేవతా త్ర్యంబకః - ప్రత్యధిదేవతా - కాలస్వరూప సూర్యః, నవోనవ ఇతి మంత్రేణ ప్రధానదేవతాం చంద్రం, త్ర్యంబక మంత్రేణ త్ర్యంబకం, ఆకృష్ణేన ఇతి మంత్రేణ సూర్యం పరివారదేవతా సహితం ఆవాహ్య సంపూజ్య అగ్నిం ప్రతిష్ఠాప్య యథాశక్తి సంఖ్యయా ఆవాహిత దేవతా మంత్రహవన పూర్వకం ప్రధాన దేవతా మంత్రహవనం కుర్యాత్
శేషం పూర్వవత్. అశీతి దీపైర్నీరాజనమ్॥

### పంచాశీతితమే వర్షే కర్తవ్యా

## రౌద్రీశాంతిః (85)

అస్యాం శాంత్యాం ప్రధాన దేవతా మృత్యుంజయ రుద్రః
ఉప దేవతా మృత్యుంజయ త్ర్యంబకః. ప్రధాన దేవతాం మానస్తోకేతి మంత్రేణ ఆవాహయేత్. తదుత్తరే త్ర్యంబకం, తదుత్తరే నక్షత్ర దేవతాం పరివారదేవతా సమేతాం ఆవాహ్య సంపూజ్య అగ్నిం ప్రతిష్ఠాప్య ఆవాహిత దేవతా మంత్రైః హుత్వా ఘృతాక్త తిలైః యథాశక్తి సంఖ్యం ప్రధాన దేవతాయై

మానస్తోకేతి మంత్రేణ హునేత్. శేషం పూర్వవత్. పంచాశీతి దీపైర్నీరాజనమ్.

## నవతితమే వర్షే కర్తవ్యా

# సౌరీశాంతిః (90)

అస్యాం శాంత్యాం ప్రధాన దేవతా కాలస్వరూప సూర్యః. ఉపదేవతా మృత్యుంజయ త్ర్యంబకః. తచ్చక్షురితి మంత్రేణ ప్రధాన దేవతా ఆవాహనం పూజనంచ కృత్వా తన్మంత్రేణైవ సమిదాజ్య చరుపాయస ద్రవ్యైః హునేత్. శేషం పూర్వవత్. నవతిదీపైః నీరాజనమ్.

అస్మిన్ శాన్త్యాం అరుణసూక్త మహాసౌరాది హవనం అవశ్యం కరణీయం ఇతి కేచన వదన్తి ।

## పంచ నవతితమే వర్షే క్రియమాణా

# త్రైయంబక మృత్యుంజయ శాంతిః (95)

ప్రధాన దేవతా మృత్యుంజయ రుద్రః. 'ఓం భూర్భువస్వః ఓం త్ర్యంబకం యజామహే--మామృతాత్ ఓం స్వర్భువర్భూః ఓం' ఇతి మంత్రేణ మృత్యుంజయ రుద్రం ఆవాహ్య సంపూజ్య తేనైవ మంత్రేణ హునేత్. శేషం పూర్వవత్. పంచనవతి దీపైర్నీరాజనమ్.

## శతతమే వర్షే కర్తవ్యా

# మహామృత్యుంజయ శాంతిః (100)

ప్రధాన దేవతా మహా మృత్యుంజయః. పరివార దేవతాః విశ్వేశ్వరాది ఏకాదశరుద్రాః. ఉపదేవతా సూర్యః. ఆజ్య పాయస తిల ద్రవ్యేణ హోమః.

యజమానః అశక్తశ్చేత్ పుత్రోవా ఆచార్యోవా కారయేత్. అత్ర మంత్రః 'ఓం హౌం జూం సః ఓం భూర్భువస్వః ఓం త్ర్యంబకం -- మామృతాత్ ఓం స్వర్భువర్భూః ఓం సఃజూం హౌం ఓం' ఇతి మంత్రేణ ఆవాహన పూజా హోమాః అత్ర ఏకాదశ రుద్రాః - విశ్వేశ్వర మహాదేవ విరూపాక్ష సదాశివ త్ర్యంబక త్రిపురుష రుద్ర త్రిపురాంతక సర్వేశ్వర శంకర విశ్వరూపాః పరివార దేవతాః. ఏషాం నామమంత్రేణ, సూర్యస్య ఆకృష్ణేనేతిమంత్రేణ పూజా హోమాదయః. శేషం పూర్వవత్. శతదీపైః నీరాజనమ్.

# చిరంజీవ ప్రార్థనా

సర్వాసు శాన్తిషు కర్త్రా పఠనీయా చిరంజీవ ప్రార్థనా

ప్రతి మంత్రం సాష్టాంగ ప్రణామః

1. మార్కండేయ మహాభాగ సప్తకల్పాన్త జీవన
ఆయురారోగ్యమైశ్వర్యం దేహిమే మునిపుంగవ॥ మార్కండేయాయనమః

2. ద్రొణిమేత్వం మహాభాగ రుద్రతేజసముద్భవ
ఆయుర్బలం యశోదేహి అశ్వత్థామన్! నమోస్తుతే॥ అశ్వత్థామ్నేనమః॥

3. దైత్యేంద్రకుల సంభూత యజ్ఞదాన క్రియారత
బలేత్వాం శరణంయామి దీర్ఘాయుష్యం ప్రయచ్ఛమే॥ బలినే నమః॥

4. వసిష్ఠ కుల సంభూత వేదశాస్త్ర విశారద
నారాయణాంశ సంభూత వేద వ్యాస నమోస్తుతే॥ వేదవ్యాసాయ॥

5. అంజనీ గర్భ సంభూత కపీంద్ర సచివోత్తమ
రామప్రియనమస్తుభ్యం హనుమన్ రక్షమాం సదా॥ హనుమతే॥

6. విభీషణ నమస్తుభ్యం రామపాదాబ్జపూజక
ఆయురారోగ్యమైశ్వర్యం దేహిపౌలస్త్యనందన॥ విభీషణాయ॥

7. ద్విజేంద్ర భరతాచార్య సర్వవిద్యావిశారద
శరణం త్వాం ప్రపన్నోస్మి కృప మాం రక్షసర్వదా॥ కృపాయ॥

8. రేణుకేయ మహాభాగ కార్యవీర్య కృతాంతక
ఆయుః ప్రయచ్ఛమే రామ జామదగ్న్య నమోస్తుతే॥ పరశురామాయ॥

9. మహానృసింహ భక్తో మే ప్రహ్లాదో రాక్షసేశ్వరః
దదాతు చిరజీవిత్వం యావజ్జీవమరోగతామ్॥ ప్రహ్లాదాయ॥

## సమయాభావమున నామ
## మంత్రములుపయోగించుటకు

అగ్నిః ప్రజాపతిః సోమో రుద్రోఽ దితి ర్బృహస్పతిః
సర్పాశ్చపితరశ్చైవ భగశ్చైవార్యమాఽపిచ
సవితా త్వష్టాఽథ వాయుశ్చేంద్రాగ్నీ మిత్రఏవచ
ఇంద్రోనిర్ఋతి రాపోవై విశ్వేదేవాస్తథైవచ
విష్ణుర్వసవోవరుణోఽజ ఏకపాత్ తథైవచ
అహిర్బుధ్న్యస్తథా పూషా అశ్వినౌ యమ ఏవచ
నక్షత్ర దేవతా ఏతా ఏతాభిర్యజ్ఞకర్మణి ॥
ఇతివేదాంగ జ్యోతిషే.

| నక్షత్రాణి | దేవతానామమన్త్రౌ | | నక్షత్రనామమన్త్రౌ | |
|---|---|---|---|---|
| అశ్వినీ | అశ్విభ్యాంనమః | అశ్వినౌఆవాహయామి | అశ్వయుగ్భ్యాంనమః | అశ్వయుజౌఆవా |
| భరణి | యమాయ | యమం | అపభరణీభ్యో | అపభరణీః |
| కృత్తిక | అగ్నయే | అగ్నిం | కృత్తికాభ్యో | కృత్తికాః |
| రోహిణి | ప్రజాపతయే | ప్రజాపతిం | రోహిణ్యై | రోహిణీం |
| మృగశిర | సోమాయ | సోమం | మృగశీర్షాయ | మృగశీర్షం |

| | | | | |
|---|---|---|---|---|
| ఆర్ద్ర | రుద్రాయ | రుద్రం | ఆర్ద్రాయై | ఆర్ద్రాం |
| పునర్వసు | అదితయే | అదితిం | పునర్వసుభ్యాం | పునర్వసూ |
| పుష్యమి | బృహస్పతయే | బృహస్పతిం | పుష్యాయ | పుష్యం |
| అశ్లేష | సర్పేభ్యో | సర్పాన్ | అశ్లేషాయై | అశ్లేషాం |
| మఖ | పితృభ్యో | పితౄన్ | మఘాయై | మఘాం |
| పుబ్బ | భగాయ | భగం | పూర్వఫల్గుణీభ్యాం | పూర్వఫల్గున్యౌ |
| ఉత్తర | అర్యమ్ణే | ఆర్యమణం | ఉత్తరఫలుణీభ్యాం | ఉత్తరఫల్గున్యౌ |
| హస్త | సవిత్రే | సవితారం | హస్తాయ | హస్తం |
| చిత్త | త్వష్ట్రే | త్వష్టారం | చిత్రాయై | చిత్రాం |
| స్వాతి | వాయవే | వాయుం | స్వాత్యై | స్వాతీం |
| విశాఖ | ఇంద్రాగ్నిభ్యాం | ఇంద్రాగ్నీ | విశాఖాభ్యాం | విశాఖే |
| అనూరాధా | మిత్రాయ | మిత్రం | అనూరాధాభ్యో | అనూరాధాః |
| జ్యేష్ఠా | ఇంద్రాయ | ఇంద్రం | జ్యేష్ఠాయై | జ్యేష్ఠాం |
| మూల | నిర్ఋతయే | నిర్ఋతిం | మూలాయ | మూలాం |
| పూర్వాషాఢ | అద్భ్యో | అపః | పూర్వాషాఢాభ్యాం | పూర్వాషాఢే |
| ఉత్తరాషాఢ | విశ్వేభ్యోదేవేభ్యో | విశ్వాన్‌దేవాన్ | ఉత్తరాషాఢాభ్యాం | ఉత్తరాషాఢే |
| శ్రవణం | విష్ణవే | విష్ణుం | శ్రవణాయ | శ్రవణం |
| ధనిష్ఠ | వసుభ్యో | వసూన్ | ధనిష్ఠాయై | ధనిష్ఠాం |
| శతభిష | వరుణాయ | వరుణం | శతభిషజే | శతభిషజం |
| పూర్వాభాద్రా | అజైకపదే | అజైకపదం | పూర్వప్రోష్ఠపద్భ్యాం | పూర్వప్రోష్ఠపదే |
| ఉత్తరాభాద్ర | అహిర్బుధ్న్యాయ | అహిర్బుధ్న్యం | ఉత్తరప్రోష్ఠపద్భ్యాం | ఉత్తరప్రోష్ఠపదే |
| రేవతి | పూష్ణే | పూషాణం | రేవత్యై | రేవతీం |

## చివరగా ఒక మనవి

గుణదోషౌ బుధో గృహ్ణాన్ ఇందు క్ష్వేళా వివేశ్వరః
శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి ॥

సముద్రములో పుట్టిన విష చంద్రులలో విషమును కంఠమునందు దాచి చంద్రుని శిరస్సున ధరించిన శివునివలె విద్వజ్జనులు మంచి చెడులలో మంచినే స్వీకరించి దోషములను మన్నించి ఆశీర్వదించ ప్రార్థన.

విద్వజ్జన విధేయుడు
పార్వెళ్ళ శ్రీధరశర్మ





# పార్వెళ్ళ ఆనందరాములు-హరిప్రియ

పూ॥బ్ర॥శ్రీ॥ పితృచరణుల
పాదపద్మములయందు కుసుమార్పణము





# పరిచయము

## పార్వెళ్ళ శ్రీధర శర్మ

కృష్ణయజుర్వేదాధ్యయనము బ్రా॥శ్రీ॥వే॥మూ॥ మాడుగుల మాణిక్యసోమయాజి గారి వద్ద
శ్రీ శాస్త్రుల విశ్వనాథ శర్మ శివంపేట గారిచే స్థాపించబడిన శంకరాద్వైత వేద సంస్కృత విద్యా పీఠములో
పూర్వ మీమాంసాశాస్త్రాధ్యయనము బ్రా॥శ్రీ॥ రాంభట్టర్ గారి వద్ద
శృంగగిరి సంస్థానీయ భారతీయ గీర్వాణ ప్రౌఢ విద్యాభివర్థినీ కళాశాల బెంగూళూర్‌లో
M.A. సంస్కృతం Mysore University, M.A. సంస్కృతం Kakathiya University
M.A. తెలుగు Osmaniya University, (M.Phil) Nagarjuna University

ధర్మపత్ని - చి॥ల॥సౌ॥ శ్రీలత

కుమార్తె - చి॥ అభిజ్ఞ

కుమారుడు - చి॥ రఘుచరణ శర్మ

వృత్తి - సంస్కృతాధ్యాపనము, యాజ్ఞికములు

శ్రీ శ్రీభాష్యం విజయసారథి గారు స్థాపించిన శ్రీయజ్ఞవరాహ క్షేత్రీయ
సర్వవైదిక సంస్థాన స్థానా చార్యులు
శ్రీ అష్టకాల నృసింహరామ శర్మ గారు స్థాపించిన సరస్వతీ యజ్ఞసేవా సమితిలో ప్రధాన యాజ్ఞికులు

శాశ్వత చిరునామా : ఇ.నెం. 10-1-396, సంతోష్‌నగర్, కరీంనగర్.
ప్రస్తుతము : ఇ.నెం. 6-279/30, కాకతీయనగర్,
చింతల్ మం॥ కుతుబుల్లాపూర్, సికిందరాబాద్.

శారద మల్టీకలర్ ప్రింటర్స్, కరీంనగర్-9705155765